## సన్నిధాపన ముద్రా లక్షణమ్

శ్లో ॥ ఉత్తానాంగుష్ఠ యోగేన ముష్టి కృత కరద్వయః ।
సన్నిధీ కరణీ నామ ముద్రా దేవార్చనా విధౌ ॥ (తంత్ర రాజే)

తా ॥ రెండు పిడికిళ్ళను ఒక దాని కొకటి అభిముఖముగా నుంచి బొటనవ్రేళ్ళను ఊర్ధ్వముఖముగా నుంచిన సన్నిధాపన ముద్ర యగును.

## సన్నిరోధన ముద్రా లక్షణమ్

శ్లో ॥ అంగుష్ఠ గర్భిణీసైవ ముద్రస్యాత్సన్నిరోధినీ ॥

తా ॥ బొటనవ్రేళ్లను ముడిచి పిడికిళ్ళను బిగించి రెండును పరస్పరము నభిముఖముగా నుంచిన సన్నిరోధన ముద్రయగును.

## అవకుణ్ఠన ముద్రా లక్షణమ్

శ్లో ॥ సవ్యహస్త కృతాముష్టిర్దీర్ఘాధోముఖ తర్జనీ
అవకుణ్ఠన ముద్రేయ మభితో ముద్రితా మతా ॥ (లక్ష్యసంగ్రహే)

తా ॥ కుడిచేతి పిడికిలి దీర్ఘముగా, క్రింది ముఖముగల చూపుదు వేలు కలదైనచో అవకుంఠన ముద్రయగును.

## యోని ముద్రా లక్షణమ్

శ్లో ॥ మధ్యమే కుటిలే కృత్వా తర్జన్యుపరి సంస్థితే
అనామికా మధ్యగతే తథైవహి కనిష్టికే
సర్వాస్సర్వత్ర సంయోజ్య అంగుష్ఠ పరిపీడితాః
ఏషాతు ప్రథమా ముద్రా యోనిముద్రేతి సంజ్ఞికా ॥

తా ॥ మధ్యమవ్రేళ్ళు కొంచెము వంచి చూపుదువ్రేళ్ళ చివరి భాగములపై మధ్యమ వ్రేళ్ళు అగ్ర భాగములను తగిల్చి ఉంగరపు వ్రేళ్ళను పరస్పరము తర్జనీ మధ్యమములలో నుంచి రెండు మధ్య వ్రేళ్ళ క్రింద ఆ విధముగానే చిటికెన వ్రేళ్ళ నుంచి బ్రొటన వ్రేళ్ళతో నొక్కపబడిన యోనిముద్రయగును.



## పూజా ద్రవ్య శుద్ధి

శ్లో ॥ పుష్ప నైవేద్య గంధాదీన్ "హ్రీం హ్రూం ఫట్" ఇతి
మన్త్రతః దృష్టం వాచాత్మవిజ్ఞాతం సమ్యక్పుష్పాది దూషణం ।
అస్పృశ్యస్పర్శకం వాపి యదన్యాయార్జితం చ వా ।
తథా నిర్మాల్య సంస్పృష్టం కీటాద్యారోహణం చయత్ ।
తత్సర్వన్నాశమాయాతి శమాయాతి నైవేద్యాద్యవలోకనాత్ ॥
(ఇతి మేరు తంత్రే)

తా ॥ పుష్ప నారికేళ ఫల గంధాక్షత పత్రాది పూజాద్రవ్యములయందు "హ్రీం హ్రూం ఫట్" అను మంత్రముచే జలమును ప్రోక్షించిన స్పర్శదోషము, అన్యాయార్జితాది ద్రవ్యదోషములు మొదలగునవన్నియు నైవేద్య దృష్టి దోషము వలన కలిగిన దోషముతో సహా నశించును.

"హ్రీం హ్రూం ఫట్" ఇతి కలశోదకేన పూజ్యా ద్రవ్యాణి సంప్రోక్ష్య దేవమాత్మానం చ సంప్రోక్ష్య ॥

# యాగశాలా నిర్మాణము

ప్రతిష్ఠా కార్యక్రమము నందు మంటప దేవతా ఆవాహనమునకు హోమాదులను జరుపుటకు యాగశాలా నిర్మాణము అవసరము. యాగశాలా భూమిని ఉపయోగానుకూలముగా చదునుచేసి 16 మూరలు గాని 32 మూరలుగాని కొలతలుండునట్లుగా సమచతురస్ర స్థలమును సిద్ధము చేసుకొనవలెను. సమానమగు కొలతలుండునట్లు తూర్పు నాలుగు పశ్చిమమమున నాలుగుస్తంభములను యేర్పరచుకొనవలెను. దక్షిణోత్తరదిశలయందు. రెండేసి చొప్పున నాలుగు స్తంభములను పాతవలెను. అప్పటి పన్నెండు స్తంభములవుతాయి. యే దిక్కు నుండి చూచినా నాలుగు స్తంభములుగా కనిపిస్తాయి. స్తంభములు పాతేటపుడు వంకరగాలేక ఒకే వరుసలో ఉండునట్లు జాగ్రత్త తీసుకొనవలెను. అనంతరము యాగశాల మధ్య భాగంలో సమంగా నాలుగు మూలలా సమమైన కొలతలతో నాలుగు స్తంభములు పాతాలి. మొత్తము స్తంభములు 16 అవుతాయి. దీనినే షోడశ స్తంభశాల అంటారు. దానిపైన లోపలనున్న స్తంభముల నుండి దిగువకు పన్నెండు స్తంభముల వరకు కొంత ఖాళీ స్థలమును వదిలి గుడిశెవలె నిర్మించాలి. సమచతురస్త్రముగా వేదికను ఏర్పరచుకోవాలి. అనంతరము యాగశాలను స్తంభముల నడిమిభాగములు తొమ్మిదిగా సమచతుస్త్రముగా యేర్పరచుకోవాలి.

యిలా యేర్పరచిన తొమ్మిది గదులకు తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తర దిశల గదులకు బైట వైపు ద్వారములను యేర్పరచుకొని మిగిలిన చుట్టు నాలుగు వైపులా దడికట్టి మూసివేయాలి. మధ్యలో మూసి వేయవలసిన అవసరము లేదు. కుండ నిర్మాణాదులకు పీఠనిర్మాణాదులకు యీ నడిమి గీతలను కొలతకు ఉపయోగించుకొనవలెను.






# కుండ నిర్మాణ పద్ధతి

ఈ దిగువ చూపబడుచున్న కుండ నిర్మాణ పద్ధతి శ్రీ ప్రభువిద్యా ప్రతిష్ఠాది పూర్వ గ్రంథముల నుండి స్వీకరించి ఇవ్వబడుచున్నది.

1. చతురస్రము 2. యోని కుండము 3. త్రికోణ కుండము (1) 4. త్రికోణ కుండము (2) 5. అర్ధచంద్ర కుండము 6. వృత్త కుండము 7. పద్మ కుండము (1) 8. పద్మకుండము (2) 9. పంచాస్రకుండము 10. పంచాస్ర కుండము 11. సమషడస్ర కుండము 12. సమసప్తాస్ర కుండము 13. సమ అష్టాస్ర కుండము. పూర్వ గ్రంథములందు పైన తెలిపిన కుండములు 13 విధములు. అన్ని కుండములను ప్రతి కార్యమునందు వినియోగించవలసిన అవసరం వుండదు.

## కుండ లక్షణమ్

శ్లో ॥ నవకుండ విధానేతు దిక్షు కుండాష్టకేకృతే ।
నవమంకార యేత్కుండం పూర్వేశానదిగంతరే ॥
పురందరేశయోర్మధ్యే వృత్తం వాచతురశ్రకం ।
అష్టాస్వాశాసుకుండాని రమ్యా కారాణ్యనుక్రమాత్ ॥
చతురశ్రం యోనిమర్ధ చంద్రంత్ర్యంశంసువర్తులం ।
షడశ్రంపంకజాకార మష్టాశ్రంతానినామతః ॥
ఆచార్యకుండం మధ్యేస్యా ద్గౌరీపతి మహేంద్రయోః ॥

హోమమును చేయుటకు కుండలములుండవలయును. అందు నిమిత్తము 9 కుండముల నేర్పరచెడి విధానములో ఎనిమిది దిక్కులయందు ఎనిమిది కుండములును, తూర్పు ఈశాన్య దిక్కుల నడుమ నొక కుండమును రమ్యముగా నుండునట్లు చేయవలయును. ఆ కుండములు ఏవిధముగా నుండవలయుననగా, నాలుగు కోణములు కలది, యోని ఆకారము, అర్ధ చంద్రాకారము మూడు అంచులు కలది, గుండ్రనైనది, ఆరు అంచులు కలది, పద్మాకారము కలది, ఎనిమిది అంచులు కలది. ఇట్లు ఎనిమిది విధములుగా ఉండు కుండములను ఎనిమిది దిక్కులయందు తీయవలెను. ఆచార్య కుండమును

ప్ప దిక్కుల నడుమను గుండ్రముగ గాని నాలుగు కోణములు ఆయవలయును.

వినియోగము మూడు పక్షములుగా ఉన్నది.

1. ఏక కుండీ పక్షము 2. పంచకుండీ పక్షము 3. నవకుండీ పక్షము

## 1. సమచతురస్రకుండము




శ్లో ॥ సమంతాత్కుండమే తత్స్యా చ్చతురశ్రం శుభావహం ।

చతుర్వింశత్యంగులాఢ్యం మేఖలత్రితయాన్వితం ॥

చతురశ్ర కుండమనగా నాలుగు పలకలుగా ఇరువది నాలుగు అంగుళములు ఎటు చూచినా ఉండునట్లుగను మూడు మేఖలములుండునట్లును నిర్మింపవలయును.

## 2. యోని కుండము



శ్లో ॥ చతుశ్రీకృతం క్షేత్రం పంచధావిభజేత్సుధీః ।

న్యసేత్పుర స్తాదేకాంశం కోణార్ధార్ధ ప్రమాణతః ।



భ్రామయేత్కోణమానేన తథా న్యదపిమంత్రవిత్ ।

సూత్రయుగ్మం తతో దద్యాత్కుండం యోని నిభంభవేత్ ॥

సమచతురముగా చతుశ్రకుండము నుండును కాబట్టి దానిని అయిదు భాగములు చేసి మధ్యగానుండు భాగము చివర రెండు సూత్రములనుంచి యాసూత్రముల రెండు చివరలను పైగా నుండు అయిదు భాగముల నిరుప్రక్కల నుండు కోణముల పర్యంతము పట్టగ యోని ఆకారముగ నుండును. అట్టి యాకారముగా త్రవ్వబడినది యోని కుండమనఁబడును.

## 3. త్ర్యశ్ర (త్రికోణ) కుండమ్



త్ర్యశ్ర (త్రికోణ) కుండమ్

శ్లో ॥ చతుర్ధావిభజేత్ క్షేత్రం న్యసేదు భయపార్శ్వయోః ।

ఏకైకమంశంతన్మానా దగ్రతోలాంఛయేత్తతః ॥

తత్ర సూత్రత్రయం కుర్యాత్త్ర్యశకుండ ముదాహృతం ॥

చతురశ్రకుండప్రదేశమును నాలుగు భాగములు చేసి పైగా నిరుప్రక్కల కోణముల వద్దను సూత్రములను పట్టి ఆ రెండు సూత్రములను దిగువ ప్రదేశమున మధ్య ప్రదేశమునకు కలిపి పట్టగా మూడు పలకలుగ నుండును. ఆ విధముగా త్రవ్వబడినది త్ర్యశ్య (త్రికోణ) కుండము.

## 4.వృత్తాకార కుండము



శ్లో ॥ అష్టాదశాంశకే క్షేత్రే బహిరంశంన్య సేద్బుధః ।
భ్రామయేత్తేనమానేన వృత్తకుండమనుత్తమం ॥

చతురశ్ర కుండప్రదేశమును 18 భాగములు చేసి దాని మయముగ సూత్రమును పట్టి బహిరంశమునందు సూత్రమును త్రిప్పుచు రాగా వృత్తాకారముగ నుండును. అట్టి ఆకారముగ త్రవ్వబడిన కుండము వృత్తకుండము.

## 5. పద్మ కుండము



## పద్మకుండమ్ - 1

శ్లో ॥ వృత్తాని కర్ణికాదీనాం బహిస్త్రీణి ప్రకల్పయేత్ ।
పద్మకుండమితిఖ్యాతం పశ్యతాం సుమనోహరం ॥

కర్ణిక మొదలగు వాట్లను వెలుపలను మూడు వృత్తములు గీచిన యెడల దానిని పద్మ కుండమని చెప్పిరి.



## పద్మకుండమ్ - 2

అన్యః ॥ శ్లో ॥ చతుర్భాగకృతం క్షేత్రం ఏకైకాంశంన్య సేత్తతః ।
క్షేత్రార్ధం తేనమానేన మత్స్యంకృత్వా విచక్షణః
తన్మధ్యమాచ్చతుర్దిక్షు చతుష్పత్రంతువర్తులే ।
సరోజ కుండమేవంతు కల్పయేచ్ఛాస్త్ర కోవిదః ॥

పద్మ కుండమును గురించి మరియొకరు చెప్పినదేమనగా, నాలుగు భాగములుగ క్షేత్రములను విభజించి క్షేత్రార్ధభాగమును ఒక్కొక్క అంగుళము చొప్పున హెచ్చుగనుంచుకొనును అట్టి ప్రమాణముగానే మత్స్యాకారముగా గీచి దాని మధ్య ప్రదేశమునుండి నాలుగు దిక్కులను నాలుగు పత్రములను వర్తులముగ గీచిన పద్మాకారమగును. అట్టి ఆకారముగా ఉండునది పద్మకుండమని మరియొకరు చెప్పిరి.

## 6. పంచాస్త్ర కుండము 1



యిరవై నాలుగు అంగుళముల సమచతురస్రమును యేర్పరచుకుని అందునాల్గవ వంతు అనగా ఆరు అంగుళములు తగ్గించి 18 అంగుళములు అనగా నాభినుండి 9 అంగుళముల కొలతలు వృత్తమును గీచుకొనవలెను. యీ వృత్తమును అయిదు సమభాగములుగా యేర్పరచుకొనవలెను. అయిదు భాగములలో తూర్పున అగ్రభాగము వుండేలా కోణము వచ్చేలా రెండు రేఖలను గీచుకొనవలెను. రెండవ రేఖ నుండి మూడవ రేఖ వరకు రెండవ కోణము మూడవ రేఖ నుండి నాల్గవ రేఖ వరకు మూడవ కోణమును. నాల్గవ రేఖ నుండి

అయిదవ రేఖ వరకు నాల్గవ కోణమును అయిదవ రేఖ నుండి మొదటి రేఖ వరకు అయిదవ కోణమును యేర్పరచుకొనవలెను. వృత్తము పైన కోణములు వుండాలి. ఇది ఒక రకమగు పంచాస్రకుండలమవుతుంది. మిగిలిన కొలతలు కుండ నిర్మాణము మామూలే.

## 7. పంచాస్ర కుండము 2



పదకొండు అంగుళముల కొలతలలో ఒక వృత్తము గీచుకొనవలెను. ఆ వృత్తమునకు పైన 18 అంగుళముల 4 యవలు వృత్తమును యేర్పరచుకొనవలెను. మొదటి 11 అంగుళముల వృత్తము యొక్క అయిదు భాగములను విదిశలతో సమానము చేయవలెను. దాని మధ్యలలో తిరిగి రేఖలను గీయవలెను. అపుడు పదకొండు అంగుళముల వృత్తము పది భాగములవుతుంది. (లోపలివైపు) దానిని ననుసరించి మరల 18 అంగుళముల వృత్తములో అయిదు భాగాలు యేర్పరచుకోవాలి. అగ్రము తూర్పు భాగాన వుండేలా కోణరేఖలను యేర్పరచుకోవాలి. ఆరేఖల ప్రకారమిగిలిన నాలుగు కోణాలను కూడా యేర్పరచకోవాలి. యిలా సిద్ధమయిన కుండము రెండవ పద్ధతిలో పంచాస్ర కుండము. నిలువుకొలతలు మేఖలాత్రయము యథాప్రకారం యేర్పరచుకొనాలి.



## 8. సమషడస్రకుండము



24 అంగుళముల సమచతురస్రరేఖలను యేర్పరచి దానిలో పదు నాలుగు అంగుళముల ఏడు యవల రెండు యూకల కొలత యుండునట్లుగా వృత్తమును యేర్పరచుకొనాలి. సమానమగు కొలతలతో ఆరు భాగములను యేర్పరచి కోణములను తయారు చేయుట ద్వారా షడస్రకుండము యేర్పడుతుంది. ఉత్తర దిశ నుండి పై భాగమునకు ఒక రేఖను, దాని నుండి దక్షిణాంశమునకు మరియొక రేఖను దానినుండి దక్షిణమునకు మరియొక రేఖ దక్షిణము నుండి క్రింది భాగము వరకు ఒక రేఖ, దాని నుండి ఎడమ వైపునకు ఒక రేఖ దాని నుండి ఉత్తర దిశకు ఒక రేఖ, దాని నుండి మొదటి రేఖను కలుపుతూ మరియొక రేఖ మొత్తము రేఖలు 7. కోణములు 6. సమషడస్ర కుండము తయారవుతుంది.

## షడశ్ర కుండమ్

శ్లో ॥ అష్టధావిభజేత్ క్షేత్రం మధ్య సూత్రస్య పార్శ్వయోః ।
భాగంన్య సేదేక మేకం మానేనానేనమధ్యతః ॥
కుర్యాత్పార్శ్వయుగే మత్స్య చతుష్కంశాస్త్రవిత్తమః ।
సూత్రషట్కంతతో దద్యాత్షడశ్రం కుండముత్తమ్ ॥

కుండ ప్రదేశము నెనిమిది భాగములు చేసి నడుమ సూత్రము యొక్క రెండు ప్రక్కలను ఒక్కొక్క భాగము నుంచి మధ్య ప్రదేశమునకు రెండు ప్రక్కలను ఇటు రెండు అటు రెండు నాలుగు మత్స్యాకారములను గీచి ఆరు సూత్రములను ఆరు కోణములకు పట్టగా షడశ్రముగనుండును ఆ విధముగా ఉండునది షడశ్ర కుండము.

## 10. సప్తాస్ర కుండము



24 అంగుళముల సమచతురస్రరేఖను యేర్పరచుకొని దాని వెలుప తూర్పు భాగంలో చతురస్రము యొక్క అనగా మూడు అంగుళాల రెండు యవల మూడు యూకల మూడు విక్షల మూడు బాలాగ్రములు పెంచవలెను. అదే విధంగా దక్షిణ, పశ్చిమ భాగమునుండి పెంచవలెను. తూర్పు భాగమున పెంచిన రేఖపై భాగమునుండి గోళాకార వృత్తమును యేర్పరచవలయును. యీ వృత్తము నాలుగు దిశలలో పెంచిన రేఖలను కలుపుతూ ఉండాలి. ఆ వృత్తములో తూర్పు నుండి సరిసమానమగు యేడు భాగములను యేర్పరచవలెను. యిలా యేర్పడిన భాగములు కోణములుగా యేర్పరచినచో సప్తాస్ర కుండము తయారవుతుంది.

## 11. అష్టాస్ర కుండము



పదు నాలుగు అంగుళాల రెండు యవల మూడు యూకల కొలతలు ఒక వృత్తమును యేర్పరచుకోవాలి. ఆ వృత్తము నుండి తూర్పు, దక్షిణ, పశ్చిమ,



ఉత్తరదిశలను ఆగ్నేయాది విదిశలను ఆమధ్యభాగములో ఉపదిశలను గుర్తించి 16 భాగములను రేఖాత్మకంగా యేర్పరచుకోవాలి. యీ 16 భాగములు రెండు, భాగములను కలిపి తూర్పు నుండి కోణములను యేర్పరచినచో అష్టాస్రకుండము యేర్పడుతుంది. దీని అగ్రభాగము తూర్పుదిశకు ఉంటుంది.

### అష్టాశ్రకుండమ్

శ్లో ॥ శ్రుణుష్వష్టాశ్రకుండం వై క్షేత్రే గాయత్రి భాజితే ।
తదేకాంశంబహిర్న్యస్య పరితశ్చతురశ్రకం ॥
కర్ణార్ధ సూత్రమానేన కోణా త్కోణం తులాంఛయేత్ ।
చతుర్దిక్ష్వష్టకోణాఖ్యం కుండంకుర్యాత్సలక్షణం ॥

అష్టాశ్రకుండ మెట్లనగా క్షేత్రమును మూడు భాగములు చేసి దానిలో నొక అంగుళమును వెలుపల నుంచి దాని చుట్టు చతురశ్రముగ గీచి చెవి యొక్క ప్రమాణములో సగము ప్రమాణముగనుండు సూత్రమును నాలుగు వైపులను పట్టిన అష్టకోణముగ నుండు కుండమగును.

## 12. అర్ధచంద్రాకార కుండము



24 అంగుళముల చతురస్రం యేర్పరచి దక్షిణ దిశ మధ్యనుండి రెండున్నర అంగుళములు ఉత్తరము వైపు తీసివేయాలి. తర్వాత 19 అంగుళములు మరియు అయిదు అంగుళములు ప్రకాలమును వుంచి తూర్పు దిశ నుండి పశ్చిమ దిశకు ప్రకాలమును త్రిప్పుట వలన అర్ధచంద్రాకారకుండము యేర్పడుతుంది.

## అర్ధ చంద్రకుండమ్

శ్లో ॥ నవధావిభజేత్ క్షేత్రం చతురశ్రం సమంతథా ।
దక్షిణేచోత్త రేచాంశం ఏకైకంతు పరిత్యజేత్ ॥
సప్తాంశమధ్య మాత్రేణ భ్రమణాదర్ధచంద్రకం ॥

చతురశ్ర కుండమునకు నేర్పరచియుండెడి ప్రదేశమును 9 భాగములు చేయగా నిరుప్రక్కలనుండు రెండు భాగములను విడిచివేయగ మిగిలినది 7 భాగములు. ఆ భాగముల మధ్యను దిగువ సూత్రము బట్టి దానిని 7 భాగముల నిరుప్రక్కల పైగా నుండు కోణముల వరకు త్రిప్పుగా నర్ధచంద్రాకారముగ నుండును. ఆ విధముగ త్రవ్వబడినది అర్ధచంద్రాకారకుండము.

## 13. త్రికోణ కుండము



పద్దెనిమిది అంగుళముల రెండు యవల ఒక గోళాకార వృత్తమును యేర్పరచి ముందు నిర్మించిన వృత్త మధ్యమును తాకుచూ అదే కొలతలతో మరియొక వృత్తమును గీయవలెను. మొదటి వృత్తము యొక్క దక్షిణదిశలో ప్రకాలమును వుంచి త్రిప్పుట వలన రెండు సమవృత్తములు యేర్పడతాయి. మొదటి వృత్తము మధ్యము నుండి దక్షిణోత్తరము దిశలుగా ఒక రేఖ నిలువుగా రెండు వృత్తములను కలుపుతూ గీయవలెను. ఇలా గీయడం వలన పూర్వ పశ్చిమాలలో మూడు భాగాలు యేర్పడతాయి. మధ్యభాగంలోని మధ్యను గుర్తించి ఆ వృత్తం లోపల దక్షిణంగా వున్న రేఖ చివరినుండి వంకరగా ఒక్కొక్క రేఖను



గీయవలెను. ఆ రేఖ పూర్వదిశలోని రెండు వృత్తముల సంధి భాగములో కలుపవలెను. యీ విధంగా చేస్తే త్రికోణ కుండం యేర్పడుతుంది.

గమనిక : యీ విధంగా చేస్తే త్రికోణ కుండం యేర్పడుతుంది. యాగశాల గదుల నాభిస్థానముగా వుండునట్లు జాగ్రత్త తీసుకొనవలెను.

## కుండభేదములు

ప్రకృతము ప్రధానమైన కుండములు యధార్థముగా తొమ్మిది మాత్రమే కాని పదమూడు కుండములు ఆకార భేదాన్ని కొలతల భేదాన్ని అనుసరించి యేర్పడినది. స్థూలముగా ప్రతి కుండమును మధ్యభాగములు యిరవై నాలుగు సమ చతురస్ర అంగుళములు కలిగి వుంటాయి. అందువల్లనే హోమాది విధుల యందు 1. యేక కుండీ పక్షము 2. పంచకుండీ పక్షము 3. నవకుండీ పక్షము శాలయందు యేర్పరచుట చూపలేదు.

## ఏక కుండీ పక్షము

**ఏకకుండీపక్షే ప్రాచ్యాం ఏకమేవ కుండం**

**సర్వదేవతావాహనం, చతురస్రకుండం.**

సమచతురస్ర కుండము : యేక కుండ పక్షమున మధ్య నవాంశమందు (మధ్యగది) వుంచవలెను. యోని భాగము పశ్చిమముగాను అగ్రభాగము తూర్పు దిశయందు వుండవలెను. యోని కుండము ఈ పక్షము నందు మధ్య గది యందు వుండాలి. ఈ పక్షము నందు యోని భాగము పశ్చిమ దిశ యందు అగ్రభాగము తూర్పు దిశయందు వుండవలెను. అయితే యేక కుండీ పక్షమున యోని కుండమునకు యోని వుండదు అని చాలా మంది అభిప్రాయము.

## పంచ కుండీ పక్షము

1. ప్రాచ్యాం - **చతురస్ర కుండం.** పృథివీ - మూర్త్యధిపతి భవ - ఆపః-శర్వ
ప్రాక్ - ప్రాగధిపతి ఇంద్ర - ఆగ్నేయం అగ్ని
2. **దక్షిణస్యాం - అర్ధచంద్ర కుండం.** తేజః, ఈశాన - వాయు, పశుపతి

దక్షిణ, తమ - నైరృతి, నిరృతి.

3. ప్రతీచ్యాం - వర్తుల కుండం. ఆకాశ, రుద్ర - సూర్య, ఉగ్ర
పతీచీ, వరుణ - వాయు, వాయు

4. ఉదీచ్యాం - యోనికుండం. సోమ, భీమ - యజమాన, మహతేదేవాయ
ఉదీచీ, కుబేర - ఈశాన్యాం, ఈశానః

5. ఈశాన్యాం, ఆచార్య కుండం. ప్రధానం, - సర్వదేవతా సంస్కారార్థం.

## కుండ దోషములు

శ్లో ॥ మానహీనేమహావ్యాధి రధికేశత్రు వర్ధనం ।
భగ్నే చైవ త్వనావృష్టి స్ఫుటితే సస్యనాశనం ॥

ఈ ప్రకారము కుండలములకు ప్రమాణము చెప్పబడియున్నది. ఈ చెప్పబడిన ప్రమాణము కంటే తక్కువగా నుండిన యెడల గొప్ప వ్యాధి కలుగును. హెచ్చుగా నుండిన యెడల శత్రువుల వల్ల బాధ కలుగును. ఆ కుండము చెడిపోయిన యెడల అనావృష్టి దోషము సంభవించును. బ్రద్దలైపోయిన యెడల సస్యనాశనము కలుగును.

## అంగుళ లక్షణమ్

శ్లో ॥ మాత్రాంగులేన కర్తవ్య మన్యేనైవనకారయేత్ ।
కర్తుర్దక్షిణహస్తస్య మధ్య మాంగుళి పర్వణః ॥
తన్మధ్యదైర్ఘ్యమానేన మాత్రాంగులముదాహృతం ॥

కొలత యొక్క ప్రమాణ మెట్లనగా, మాత్రాంగుళ ప్రమాణము చేతనే కొలవవలయును. మఱియొక విధముగ కొలవ కూడదు. మాత్రాంగులమనగా యజమానుని యొక్క కుడి చేతి నడిమివ్రేలి యొక్క మూడు పర్వములలో మధ్య పర్వము ఎంత పొడవుండునో ఆ పొడవు ప్రమాణము మాత్రాంగుళమని చెప్పబడినది.



## మేఖలా లక్షణమ్

శ్లో ॥ కుండంత్రిమేఖలోపేత మేక మేఖల మేవవా ।
త్రిమేఖలో ర్ధ్వమానంతు శ్రుత్యగ్న్యశ్వినికాంగులైః ॥
యాదాకారాని కుండాని తదాకారాణి కారయేత్ ॥

ఈ చెప్పబడిన హోమకుండములను మూడు మేఖలములుగాని లేదా యొక మేఖలము కాని యుండవలయును. మూఁడు మేఖలముల నేర్పరచిన యెడల దిగువ మేఖలము నాలుగంగుళములు మధ్య మేఖలము మూడంగుళములు పై మేఖలము రెండంగుళముల వెడల్పు నుండవలెను. కుండములు యే ఆకారముగా ఉండిన మేఖలములు కూడ అట్టి ఆకారముగానే యుండవలయును.

## యోని లక్షణమ్

శ్లో ॥ అగ్న్యంగులంతు విస్తారం దైర్ఘ్యం భూతాంగులం భవేత్ ।
క్రమేణ కృశతాయోనిః కార్యాపిప్పలపత్రవత్ ॥

మూడంగుళములు పై భాగమున వెడల్పుగ నుండి అయిదఁగుళములు పొడవుగనుండి క్రమముగ చివరకు వెడల్పు తగ్గిపోయి రావియాకువలెనే చివర సన్నముగా నుండునట్లు చేయుట వలన యోనియాకారమేర్పడును.

## కుండనాభి లక్షణమ్

శ్లో ॥ పద్మాకారంతదానాభిం, కుర్యాత్కుండస్యమధ్యమే ।
ద్విభాగం దళమానంస్యా దేకభాగంతు కర్ణికా ॥
యోనౌయోనిర్నకర్తవ్యా పద్మే నాభింనకారయేత్ ।
సుధావక్త్వేష్టికాభిర్వా మృదాకుండం ప్రకల్పయేత్ ॥

కుండములో మధ్య భాగమందు పద్మాకారముగ నాభినేర్పరచవలయును. అప్పుడు రెండు భాగములు పద్మ పత్రలయాకారముగను ఒక భాగము మధ్యనుండు కర్ణికగనుండవలయును. యోనియందు యోనియాకారముండగూడదు. పద్మాకారములో నాభియాకారముండగూడదు. ఇట్టి కుండముల నేర్పరచినప్పుడు

సున్నముతోను కాల్చిన ఇటుకలతోను కట్టవలయును. అది సాధ్యము కానియెడల మట్టితోనైనను కట్టవచ్చును.

శ్లో ॥ మేఖలారహితేశోకోఽభ్యధికేవిత్తసంక్షయః ।
భార్యా వినాశనంప్రోక్తం కుండే యోన్యా వినాక్రతౌ ॥
అపత్యధ్వంసనంప్రోక్తం కుండం యత్కంఠవర్జితం ॥

కుండమునకు మేఖలముల నేర్పరచకుండిన యెడల దుఃఖము సంభవించును. అధికముగ నున్న యెడల ధననాశనమగును. కుండములో యోన్యాకార మేర్పరచకున్న యెడల భార్యా నాశనము సంభవించును. కుండమునకు కంఠాకార మేర్పరచకున్న యెడల సంతాన నాశనము కలుగును.

## ఏకహస్తప్రమాణ కుండ లక్షణమ్

శ్లో ॥ తిథ్యంగుల సమంఖాతం మేఖలాస్యాన్నవాంగులా ।
ఖాతాద్బాహ్యేంగుళంకంఠం తద్బాహ్యే మేఖలా త్రయం ॥

ఒక హస్త ప్రమాణము గల కుండ విధాన మెట్లనగా, 30 అంగులముల లోతున్నూ 9 అంగులములు మేఖలముల వెడల్పుతో కంఠాకారము నేర్పరచవలయును. ఆ కంఠమునకు వెలుపల భాగమందు మూడు మేఖలముల నేర్పరచవలయును.







సున్నము
మట్టి



## షడస్ర కుండ స్వరూపమ్



## విషమ షడస్ర కుండ స్వరూపమ్





## త్రికోణ కుండ స్వరూపమ్



## వృత్త కుండ స్వరూపమ్



## కుండ స్వరూపమ్




## పంచ కుండ స్వరూపమ్



# సర్వ ప్రాయశ్చిత్త విధిః

ఆచమ్య..........సంకల్ప్య..........శుభతిథౌ । మయా సంకల్పిత కరిష్యమాణ విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా మహోత్సవ కర్మణః దేహ ద్రవ్యాది శుద్ధ్యర్థం సర్వ ప్రాయశ్చిత్తం దశ దాన పూర్వక వరుణానయనం కర్మ కరిష్యే ।

తదాదౌ - విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా కర్మాధికార సిద్ధ్యర్థం మమ జన్మ లగ్న ప్రభృతి ఏతత్క్షణ పర్యన్తం మధ్యే వర్తిని కాలే సంభావితానాం పాపానాం నిర్హరణార్థం మత్సకల పాతక నివృత్త్యర్థం దేహ శుద్ధ్యర్థం చ సంభవత్ ప్రాయశ్చిత్తం కరిష్యే !

కాంస్య పాత్రే తండుల, తాంబూల హిరణ్యాదికం గృహీత్వా ।

పరిషదం త్రిః ప్రదక్షిణీ కృత్య ।

**సమస్త సంపత్సమవాప్తి హేతవ స్సముద్ధి తాపత్కుల ధూమకేతవః ।**
**అపార సంసార సముద్ర సేతవః పునన్తుమాం బ్రాహ్మణపాదపాంసవః ॥**
**ఆపద్ఘనధ్వాన్త సహస్రభానవ స్సమీహితార్థార్పణ కామధేనవః ।**
**సమస్త తీర్థాంబు పవిత్ర మూర్తయో రక్షన్తుమాం బ్రాహ్మణపాద పాంసవః ॥**
**ఆధివ్యాధిహరం నృణాం మృత్యు దారిద్ర్య నాశనం ।**
**శ్రీ పుష్టి కీర్తిదం వన్దే విప్రశ్రీ పాద పంకజం ॥**
**విప్రౌఘ దర్శనాత్సద్యః క్షీయంతే పాపరాశయః ।**
**వన్దనాన్మంగళా వ్యాప్తి రర్చనాదచ్యుతంపదమ్ ॥**
**నమోబ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయచ ।**
**జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః ॥**

జాయా సహితో యజమానః ప్రాఙ్ముఖస్తిష్ఠన్నేవం వదేత్ ।

అశేషేహే పరిషత్ మదీయాం విజ్ఞాపనా మవధార్య
మమ జన్మ లగ్న ప్రభృతి ఏతత్క్షణ పర్యంతం మధ్యే వర్తిని కాలే
సంభవితేభ్యః పాపేభ్యో యో దోషస్సమజని తద్దోష పరిహారద్వారా,
మత్సకల పాతక నివృత్తి ద్వారా దేహ శుద్ధ్యర్థం విష్ణాది (లింగ) దేవతా
స్థిర ప్రతిష్ఠాధికార యోగ్యతా సిద్ధి ద్వారా శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం
సౌవర్ణీం శాస్త్రీయాం మయా సమర్పితాం ఇమాం పరిషద్దక్షిణాం,
యథాశక్తి దక్షిణాం, యథోక్త దక్షిణామివ స్వీకృత్య ।
యథోక్త ప్రాయశ్చిత్తం నిశ్చిత్య ।
మమ విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠాధికార యోగ్యతా
సిద్ధిమనుగృహ్ణన్తు భవన్త । ఇతి (యజమానః వదేత్)
హే యజమాన । తవ జన్మ లగ్న ప్రభృత్యేతత్క్షణ పర్యన్తం
సమ్భావితానాం పాపానాం నిర్హరణార్థం దశ దానాన్యాచరణే సతి,
సమ్భావితేభ్యః పాపేభ్యః త్వం ముక్తోభూయాః విముక్తో భూయాః ।
తవ విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠాధికార యోగ్యతా సిద్ధిరస్త్విత్యనుగృహ్ణీమః
(ఇతి సభ్యాః)



# దశదాన విధిః

శ్లో॥ గోభూ తిల హిరణ్యాజ్య వాసోధాన్య గుడానిచ ।
రౌప్యం లవణ మిత్యాహుః దశ దానాని పండితాః

ఆచమ్య ... ప్రాణానాయమ్య - దేశకాలౌ సంకీర్త్య అముక గోత్రః శర్మాహం - మమ జన్మలగ్న ప్రభృతి ఏతత్క్షణ పర్యంతం మధ్యే వర్తినికాలే సంభవితేభ్యః పాపేభ్యో యోదోషస్సమజని తద్దోష పరిహారార్థం । మత్సకల పాతక నివృత్తి ద్వారా విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠాధికార యోగ్యతా సిద్ధ్యర్థం ।
దశ దానాన్యాచరిష్యే ।

## 1. గోదానం.

శ్లో॥ గావో మమాగ్ర తస్సంతు గావోమే సంతు పృష్ఠతః
గావోమే హృదయేసంతు గవాం మధ్యేవసామ్యహం

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
గోదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

## 2. భూదానం.

శ్లో॥ సర్వసస్యాశ్రయాభూమిర్వరాహేణ సముద్ధృతా ।
అనన్త సస్య ఫలదా అతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
భూదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### 3. తిలదానం.

శ్లో॥ మహర్షే ర్గోత్ర సంభూతాః కాశ్యపస్య తిలాస్స్మృతాః ।
తస్మాదేషాం ప్రదానేనమమ పాపం వ్యపోహతు ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
తిల దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ।

### 4. హిరణ్యదానం.

శ్లో॥ సర్వపాపక్షయకరం హిరణ్యం లోకభూషణం ।
అగ్నేర్బీజం ప్రదాస్యామి తస్మాచ్ఛాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
హిరణ్య దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యంతుభ్యమహం సంప్రదదే నమమ ।

### 5. ఆజ్యదానం.

శ్లో॥ కామధేనోః సముద్భూతం సర్వక్రతుషు సంస్థితమ్ ।
దేవానామాజ్య మాహారమతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
ఆజ్యదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ।



### 6. వస్త్రదానం.

శ్లో॥ శీతావాతోష్ణ సంత్రాణం లజ్జాయారక్షణం పరం ।
దేహాలంకరణం వస్త్రం అతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
వస్త్ర దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### 7. ధాన్యం.

శ్లో॥ సర్వదేవమయం ధాన్యం సర్వోత్పత్తి కరం మహత్
ప్రాణినాం జీవనం యస్మాత్ అతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
ధాన్య దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### 8. గుడదానం.

శ్లో॥ యథా దేవేషు విశ్వాత్మా ప్రవరశ్చ జనార్దనః ।
ప్రణవ స్సర్వ మన్త్రాణాం నారీణాం పార్వతీ తథా ॥
యథారసానాం ప్రవరః సదై వేక్షు రసోమతః
మమతస్మాత్ పరాం లక్ష్మీం దదస్వగుడ సర్వదా ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
గుడదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### 9. రౌప్యం.

శ్లో॥ ప్రీతిర్యతః పితౄణాంచ విష్ణు శంకరయోస్సదా
శివనేత్రోద్భవం రౌప్యం అతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
రౌప్యదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### 10. లవణం.

శ్లో॥ యస్మాదన్నరసాః సర్వేనోత్కృష్టా లవణం వినా
శంభు ప్రీతికరం నిత్యం అతశ్శాన్తిం ప్రయచ్ఛమే.

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
లవణ దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।



# ఇతర దానములు

### సాలగ్రామ దానము.

1. శ్లో॥ సాలగ్రామశిలాపుణ్యం భక్తిముక్తి ప్రదాయినీ ।
సాలగ్రామప్రదానేన మమసన్తు మనోరథాః ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
సాలగ్రామ దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### లవణ దానము.

2. శ్లో॥ యస్మాదన్న రసాస్సర్వేనోత్కృష్టా లవణంవినా ।
శంభోఃప్రీతికరంనిత్యమతశ్శాన్తిం ప్రయచ్ఛమే ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
లవణ దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### తామ్రపాత్ర దానము.

3. శ్లో॥ పరాపవాదపైశున్యా దభక్ష్యస్య చ భక్షణాత్ ।
ఉత్పన్న పాపం దానేన తామ్రపాత్రస్య నశ్యతు ॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
తామ్రపాత్ర దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

### కాంస్యపాత్ర దానము.

4. శ్లో॥ యాని కాని చ పాపాని కామోత్థాని కృతాని తు ।
కాంస్య పాత్రప్రదానేన తాని నశ్యంతు మే సదా॥

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
కాంస్యపాత్ర దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**రజతపాత్ర దానము.**

**5. శ్లో॥ ఆగమ్యాగమనం చైవ పరదారాభిమర్శనం ।**
**రౌప్యపాత్రప్రదానేన తాని నశ్యంతు మే సదా ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
రజతపాత్ర దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**సువర్ణపాత్ర దానము.**

**6. శ్లో॥ జన్మాంతరసహస్రేషు యత్కృతం పాతకం మయా।**
**స్వర్ణపాత్రప్రదానేన తాని నశ్యంతు మే సదా ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
సువర్ణపాత్ర దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**గో దానము.**

**7. శ్లో॥ యజ్ఞసాధనభూతా యా విశ్వస్యాఘౌఘనాశినీ ।**
**విశ్వరూపధరో దేవః ప్రీయతా మనయా గవా॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
గో దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్ దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।



**దాసీ దానము.**

**8. శ్లో॥ ఇయం దాసీ మయా తుభ్యం శ్రీవత్స ప్రతిపాదితా ।**
**సదా కర్మకరీ హృద్యా యథేష్టం భద్రమస్తు మే ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
దాసీదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**దాస దానము.**

**8. శ్లో॥ అయం దాసో మయా తుభ్యం శ్రీవత్స ప్రతిపాదితః ।**
**సదా కర్మకరో హృద్యో మమ శాంతిం ప్రయచ్ఛతు ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
దాసదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**భూమిదానము.**

**9. శ్లో॥ సర్వసస్యాశ్రయా భూమి ర్వరాహేణ సముద్ధృతా ।**
**అనంతసస్యఫలదా మమ శాంతిం ప్రయచ్ఛతు ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
భూదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**శయ్యా దానము.**

**10. శ్లో॥ అనూనం శయనం నిత్య మనూనాం శ్రియ మున్నతిమ్ ।**
**సౌభాగ్యం దేహి మే నిత్యం శయ్యాదానేన కేశవ ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
శయ్యాదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**కంకణ దానము. (బంగారపుమురుగులు)**

**11. శ్లో॥ సౌవర్ణం హస్తవలయం రూపకాంతి సుఖాస్పదమ్ ।**
**విభూషణం ప్రదాస్యామి విభూషయతు మాం సదా ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
కంకణ దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**అంగులీయకం (ఉంగరము) దానము.**

**12. శ్లో॥ హిరణ్యగర్భసంభూతం సౌవర్ణంచాంగులీయకమ్ ।**
**సర్వప్రదం ప్రదాస్వామి ప్రీతోస్తు కమలాపతిః ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
అంగులీయక దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**కుండల దానము.**

**13. శ్లో॥ క్షీరోదమథనోద్భూతం శుభదంకుం డలద్వయమ్ ।**
**శ్రియా సహసముద్భూతం దదే శ్రీః ప్రీయతాం తయా ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
కుండల దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।



**సువర్ణ దానము.**

**14. శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః ।**
**అనంతపుణ్య ఫలదం మమ శాంతిం ప్రయచ్ఛతు ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
సువర్ణ దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**రజత దానము.**

**15. శ్లో॥ అసురేషు సముద్భూతం పితృవల్లభం ।**
**తస్మాదస్య ప్రదానేన రుద్ర స్సంప్రీయతాం మయా ॥**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
రజత దానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

**సవస్త్ర సర్వ కలశ దానం**

**16. శ్లో॥ ప్రతిమాం వస్త్ర సంయుక్తాం ప్రాప్తారిష్ఠ నివృత్తయే ।**
**తుభ్యం దాస్యామి విప్రేంద్ర యథోక్త పలదోభవ ।**

అస్మై బ్రాహ్మణాయ శ్రీ మహావిష్ణు స్వరూపాయ శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థం.
విష్ణ్వాది (లింగ) దేవతా స్థిర ప్రతిష్ఠా యాగాధికార యోగ్యతా సిద్ధ్యర్థం.
సవస్త్ర పరికర సర్వకలశ ప్రతిమాదానం తుభ్యమహం సంప్రదదే నమమ ।
ఏతత్దానసాద్గుణ్యార్థం యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ ।

# ప్రతిష్ఠోపయోగి సామగ్రి

1. పసుపు
2. కుంకుమ
3. అగరువత్తులు
4. కర్పూరం
5. తమలపాకులు
6. వక్కలు
7. ఖర్జూరపు పండ్లు
8. పసుపు కొమ్ములు
9. అరటి పండ్లు
10. కొబ్బరికాయలు
11. విడిపూలు (నిత్యం 3 సార్లు)
12. పూల మాలలు (నిత్యం 2 సార్లు)
13. గంధపు డబ్బాలు
14. కొబ్బరి బోండాలు
15. చిల్లర
16. రూపాయి బిళ్ళలు
17. బియ్యము
18. విస్తరాకులు
19. ఎండు కొబ్బరి చిప్పలు
20. దీపారాధన కుందులు
21. నువ్వుల నూనె
22. అగ్గిపెట్టెలు
23. ప్రత్తి, వత్తులు
24. మైనపు వత్తులు
25. విసన కఱ్ఱలు
26. కోరా గుడ్డ (అధివాసానికి, అఖండమునకు)
27. మామిడి ఆకులు
28. నీరు సున్నము
29. ప్రమిదలు,ముంతలు, మూకుళ్ళు
30. విభూతి ప్యాకెట్లు
31. పటిక బెల్లము, బెల్లం
32. బూడిద గుమ్మడి కాయలు
33. మంచి గుమ్మడి కాయలు
34. కలశం చెంబులు
35. రవికె గుడ్డలు
36. తుండు గుడ్డలు
37. దారపు బంతులు (నలుపు, తెలుపు, ఎరుపు, పసుపు)
38. గంపలు, చాటలు
39. బానలు
40. పురికొస, చాకు, కత్తెర
41. పుట్ట మన్ను
42. బియ్యపు పిండి
43. మినప పిండి
44. తెల్ల ఆవాలు



45. పేలాలు
46. జీడిపప్పు
47. కిస్‌మిస్
48. వడపప్పు
49. కలశ పీటలు, చెంబులు, గ్లాసులు
50. **పంచ పల్లవములు**
మామిడి, మేడి, మఱ్ఱి, రావి, జువ్వి మండలు
51. **సుగంధ ద్రవ్యములు**
జాజికాయ, జాపత్రి, యాలకులు, లవంగాలు, పచ్చకర్పూరం, కుంకుమ పువ్వు, కస్తూరి, గోరోచనం
52. **నవగ్రహ ధాన్యములు**
గోధుమలు, బియ్యము, కందులు, పెసలు, శనగలు, అలచందలు, నువ్వులు, మినుములు, ఉలవలు
53. **రత్నాష్టకం**
వజ్రము, వైఢూర్యము, మరకతము, మాణిక్యము, గోమేధికము, మౌక్తికము, పుష్యరాగము, ఇంద్రనీలము, ముత్యము
54. **నవగ్రహ సమిధములు**
జిల్లేడు, మోదుగ, చంద్ర, ఉత్తరేణి, రావి, మేడి, ఔదుంబర, జమ్మి, గరిక
55. **పంచామృతములు**
ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి, తేనె, పంచదార
56. **దశమృత్తికలు**
గజశాల, అశ్వశాల, రథశాల, నదీసంగమం, అగాధజలం, యాగశాల, రాజద్వారం, వరాహూద్ధాతము, నదికి రెండు గట్టులలో, గోశాల
57. **బీజాష్టకమ్**
నువ్వులు, యవలు, పెసలు, గోధుమలు, నీవారము, తెల్ల ఆవాలు, వడ్లు, శ్యామాకము
58. **లోహాష్టకమ్**
బంగారము, వెండి, రాగి, ఇత్తడి, ఇనుము, తగరము, సీసము, సత్తు
59. **నవ పాషాణములు**
పాదరసం, మణిశిల, అభ్రకము, కృష్ణాభ్రకము, పుల్ల పాషాణము, రొడ్డిపాషాణము, గౌరీపాషాణము, సీసము, బంగారము
60. **కలశములు**
ప్రధాన, బ్రహ్మ, వాస్తు, యోగినీ,

నవగ్రహ, క్షేత్రపాల, సర్వతోభద్ర, లింగతో భద్ర మండల స్థాపిత దేవతా కలశములు, ఆచార్య, బ్రహ్మ, ఋత్విజులకు పంచపాత్ర, ఉద్ధరిణె, దీక్షా వస్త్రములు, యజ్ఞోపవీతము, దర్భాసనము

61. **దేవాలయ సామగ్రి**

శిఖర కలశములు, పంచపాత్ర, ఉద్ధరిణ, పళ్ళెములు, గంట, ధూప హారతి, ఏక హారతి, దీపపు కుందులు, అఖండ దీపమునకు మూకుడు, వింజమరలు, ఉత్సవ మూర్తులు, వాహనములు, ప్రతిష్ఠిత మూర్తులు, పాదుకలు, పళ్ళెములు, ఛత్రములు, మూర్తులకు ఆచ్ఛాదనన, అలంకార వస్త్రములు

62. స్రుక్, స్రువములు, ప్రోక్షణ, ఆజ్య, పూర్ణ, వసోర్ధారా పాత్రలు

63. ధేను (గోవు) దానము, ఆచార్య, బ్రహ్మ, ఋత్విక్, జాపక దక్షిణలు

64. **మండలములకు రంగులు**

పసుపు పచ్చ, ఎరుపు, నలుపు, ఆకుపచ్చ, తెలుపు

65. **అధివాసములకు**

గంగాజలం, పంచామృతాలు, ఆవు పంచకం, చెఱకు, వెన్న, బియ్యము సుగంధ ద్రవ్యములు, పంచ పల్లవములు, సీకాయ పొడి, వడ్లు, దుప్పటి, నవ ధాన్యాలు, అద్దము, పుష్పములు, వస్త్రములు

66. **హోమమునకు**

ఆవు నెయ్యి, రావి పుల్లలు, చిత్రిక పొట్లు, పిడకలు, పుల్లలు, విసన కఱ్ఱలు, హవిస్సు పాత్ర, మూత, గరిటె, వాస్తు బలి పాత్ర, మూత, గరిటె, తెల్ల నువ్వులు, తెల్ల ఆవాలు, తేనె, సమిధలు

67. **పూర్ణాహుతి**

సుగంధ ద్రవ్యాలు, పట్టుగుడ్డ, వట్టివేళ్ళు, ఎండు కురిడీ, పట్టు చీరె, చాటలు, నల్లపూసలు, కాటుక

**శాంతి కళ్యాణ సామగ్రి ప్రత్యేకం**



## ప్రతిష్ఠాచార్య వేదమూర్తులు

బ్రహ్మశ్రీ.......................................గారి ప్రతిష్ఠాదుల వివరము

| మూర్తి నామము | ప్రారంభ తేది | సుముహూర్తం | గ్రామము | ఫోన్ |
|---|---|---|---|---|
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |
| | | | | |




గ్రంథకర్త:
ఆగమ విశారద, అలంకార కళానిధి
శతయజ్ఞభాస్కర, ప్రతిష్ఠాచార్య
**ఆమంచి విజయభాస్కరశాస్త్రి**
గుంటూరు.
ఫోన్ : 094410 80939


'శ్రీ విజయప్రతిష్ఠా ప్రకరణమ్' గ్రంథములో "సంకల్పము" మొదలుకొని "విగ్రహప్రతిష్ఠ" వరకు గల వివిధ విషయములు ప్రామాణిక పద్ధతిలో ప్రతిపాదించబడినవి.

శ్రీమదభినవోద్దండ విద్యా భారతీ నృసింహ స్వామి వారు

స్మార్తము మాత్రమే గాకుండా ఆగమ ప్రక్రియ కూడా తెలిసికొని దేవతా ప్రతిష్ఠ చేయడమన్నది అతి ముఖ్యమైనది. 'శ్రీ విజయ ప్రతిష్ఠా ప్రకరణమ్' అను ఈ గ్రంథ రచన ద్వారా అది సాధ్యమగుచున్నది.

శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ మహాస్వామి వారు

అయంగ్రన్థః జేగీయతామాచన్ద్ర తారకమితిచ ఆశిషః సముల్ల సన్తు తరాం నితరామితిశమ్

బ్రహ్మర్షి యనమండ్ర వేణుగోపాలశాస్త్రి

'శ్రీ విజయప్రతిష్ఠా ప్రకరణమ్' అను ఈ గ్రంథము ద్వారా అనేక మంది దేవతలు భువికి దిగి వచ్చి వశింతురుగాక!

బ్రహ్మశ్రీ మద్దూరి వేంకటేశ్వరయాజి

ఆగమశాస్త్రాన్ని శ్రౌతస్మార్తవిధులతో, మంత్రములతో సమన్వయం చేసి ఈ గ్రంథానికి సమగ్ర సుందరత్వాన్ని చేకూర్చి 'శ్రీ విజయ ప్రతిష్ఠా ప్రకరణమ్' అనే మాటను సుప్రతిష్ఠితం చేశారు.

బ్రహ్మశ్రీ డా॥ మాడుగుల నాగఫణిశర్మ

పీఠాధిపతులూ, శ్రౌతస్మార్త పండితులూ నిత్య కర్మిష్ఠులూ...ఇలా ఇందరూ ఏకగ్రీవంగా ఈ గ్రంథాన్ని ఆమోదించినా 'ఉహూ'! దీనిలో..' అంటూ ఏదైనా వంక ఎవరైనా చెప్పబోతే దానిక్కారణం, 'పచ్చి అసూయ' తప్ప వేరే కానేకాదనేది యదార్థం.

బ్రహ్మశ్రీ డా॥ మైలవరపు శ్రీనివాసరావు

శాస్త్ర గ్రంథాన్ని సరళంగా చెప్పగలగడమనే అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన సమర్థత వీరిది.

బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మ

శాంతిపాఠము మొదలు అవభృథం వరకు సంప్రదాయ బద్ధములై, సప్రమాణములై 'శ్రీ విజయ ప్రతిష్ఠా ప్రకరణమ్' గ్రంథము సందర్భ విరుద్ధముగాక, బహుముఖ ప్రజ్ఞతో సాగినది.

బ్రహ్మశ్రీ వంగల రామకృష్ణ శాస్త్రి

ఆది నుండి అవభృథం వరకు చాలా వివరముగా సుస్వరయుక్తముగా ఉన్నందున ఆచరించు వశిష్ఠులకు బంగారు బాట ఈ గ్రంథము.

బ్రహ్మశ్రీ ముదిగొండ వెంకటప్పావధాని

'శ్రీ విజయ ప్రతిష్ఠా ప్రకరణమ్' అను ఈ గ్రంథమును ఆధారముగా చేసుకొని సులభతరముగా ప్రతిష్ఠలను నిర్వహించవచ్చును.

బ్రహ్మశ్రీ సోమాశి బాలగంగాధర శర్మ